# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 26 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 27-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# బొంబాయిపై నిర్ణయం ప్రధాని జరిపే గోష్ఠిలోనే తేలుతుంది

భారత విదేశాంగశాఖలో మంత్రి డా॥ సైయిద్ ... సీరియా పార్లమెంటుకద్ద సభాపతి ...

## గుంటూరు విద్యుచ్ఛక్తి

### మే 1న ప్రభుత్వ స్వాధీనం

గుంటూరు, ఏప్రిల్ 25: ఈ పట్టణంలో విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్న 'ప్రైవేటు లిమిటెడ్ కంపెనీ' ప్రభుత్వం మే 1వ తేదీన స్వాధీనపరచుకోనున్నది. ఇప్పుడు కంపెనీలో పనిచేస్తున్న సిబ్బందిని పూర్తిగా ప్రభుత్వం తీసుకోనుందని తెలిసింది.

### ఫ్రాన్సుతో జోర్డాన్ సంబంధాల తెగతెంపులు

అమ్మాన్, ఏప్రిల్ 25: అల్జీర్సులో సైనికచర్యలు జరుపుతున్న ఫ్రాన్సుతో రాజకీయ ఆర్థిక వ్యవహారాలు తెగతెంపులు చేసుకోవాలని జోర్డాన్ పార్లమెంటు దిగువసభ తీర్మానించింది.

## నిరాయుధీకరణకు రష్యా కొత్త ప్రతిపాదన

### 'పరిమిత వ్యాపారవృద్ధి' మినహా బ్రిటన్‌తో చర్చలు నిష్ఫలం

లండన్, ఏప్రిల్ 25: సోవియట్ యూనియన్ ప్రధాని శ్రీ బుల్గానిన్ కమ్యూనిస్టు నాయకుడు శ్రీ క్రుశ్చేవ్ బ్రిటిష్ ప్రభుత్వంతో వారం రోజుల దీర్ఘ సమాలోచనల ఫలితంగా చివరికి ఏ ఒక్క అంశంలోనూ అంగీకారం సాధ్యం కాలేదనీ, అభిప్రాయభేదాలు ఏ సంస్థైనా పరిష్కారం కాలేదనీ తెలుస్తోంది.

ఆఖరు దశలో రష్యన్ నాయకులు నిరాయుధీకరణ గురించి కొత్త ప్రతిపాదనలు చేశారనీ, అయినా ఈ అంశంలోకూడా రాయబారాలు ఫలించలేదనీ తెలుస్తోంది.

## శ్రీ దేశముఖ్ తర్వాత శ్రీ సుబ్రహ్మణ్యం?

### కేంద్రంలో కొత్త మంత్రులు: శ్రీ బారువాకు సహకారశాఖ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ఢిల్లీ, ఏప్రిల్ 25: కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ చింతామణ్ ద్వారకానాథ్ దేశముఖ్ బొంబాయినగరం సమస్యపై ...

### సహకార మంత్రి

### విమానం నుంచి ప్రయోగం

అమెరికన్ అధికారుల ప్రకటన

### అదుపు అసాధ్యం

(4వ పేజీ 4వ కాలం చూడుడు)

## నగరంలో విద్య శాంతిభద్రతలను కేంద్రం నిర్వహించాలని ఒక భావం

### మహారాష్ట్ర గుజరాత్‌లను కలిపి విడిగా ప్రాంతీయ మండలులను నియమించాలని సూచన

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఏప్రిల్ 26: పార్లమెంటులో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ రాష్ట్ర పునర్నిర్మాణం బిల్లుపై జరుగుతున్న చర్చలో ప్రసంగించనేలేదు. బిల్లును పరిశీలకబృందం విచారించటానికి సభ ఆమోదించింది. 27 సాయంకాలం మహారాష్ట్రసభ్యులతో మాట్లాడడం పూర్తి అయ్యేదాకా ప్రధాని ఈ విషయమై ప్రసంగించరని తెలుస్తున్నది.

పాతే బొంబాయి భవిష్యత్తు విషయమై పార్లమెంటు వర్గాలలో కొన్ని మాటలు వినిపిస్తున్నాయి. బొంబాయిని మహారాష్ట్రంలో చేర్చి, విద్య, శాంతి భద్రతల పరిపాలనను కేంద్రప్రభుత్వం నిర్వహించవచ్చునంటున్నారు. ...

... పరిష్కారమార్గాలు సూచించినా ఎవరికీ ఒకరికి అంగీకారం కాకుండా పోతున్నదన్నారు.

పరిశీలక సంఘంలో సభ్యత్వానికి ఉత్తరప్రదేశ్ సభ్యుడు శ్రీ వి. యస్. తివారీ సమ్మతించనందువల్ల ...

### లోక్‌సభలో 3 రోజులు చర్చ

### మీర్జాకు ఆఫ్ఘన్ ఆహ్వానం

పేచీల పరిష్కార అవకాశం

### కాంబోడియాపై ఫిలిప్పైన్స్ ఒత్తిడి

ప్నామ్‌పెన్, ఏప్రిల్ 25: కాంబోడియాను మనీలాకూటంలో చేర్చాలని ఫిలిప్పైన్స్ ప్రభుత్వం తమపై ఒత్తిడి తెచ్చిందని పూర్వ ప్రధాని సిహానౌక్ రాజకుమారుడు ఆరోపించారు.

జార్జిటౌన్, ఏప్రిల్ 25: ప్రజలు కమ్యూనిస్టు నాయకత్వంవల్ల సంభవించగల ప్రమాదాలను గ్రహించేవరకూ బ్రిటిష్ గయానాలో రాజ్యాంగాన్ని అమలు జరిపేది లేదని గవర్నరు ప్రకటించారు. (1953లో శ్రీ జెడ్డిజగాన్ ప్రభుత్వాన్ని తొలగించి రాజ్యాంగాన్ని ...)

## శాంతి ప్రయోజనాలకు ఉదజని బాంబు శక్తి

### రష్యా సిద్ధంగా ఉందని ప్రకటన

లండన్, ఏప్రిల్ 25: ఉదజనిబాంబు విచ్ఛేదన శక్తిని అదుపులోకి తెచ్చుకొని శాంతియుత కార్యక్రమాలకు వినియోగించడానికి రష్యా సిద్ధంగా ఉందని రష్యా అణుశక్తి శాస్త్రజ్ఞుడు డా॥ ఇవాన్ కుర్చాతోవ్ ఇవాళ బ్రిటన్‌లో హార్వెల్ అణుశక్తి పరిశోధన కేంద్రంలో 300 మంది బ్రిటిష్ నిపుణుల సభలో ప్రసంగిస్తూ తెలియచేశారు.

రష్యన్ శాస్త్రజ్ఞుని యీ ప్రకటన బ్రిటిష్ శాస్త్రజ్ఞుల్ని అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తిందట.

అమెరికా బ్రిటన్‌లు ఇంతవరకూ ఉదజనిబాంబు తయారు చేసే కృషి ...

### కాశ్మీరులో సమితి పరిశీలకులు

## మధ్యధరా సముద్రానికి అమెరికన్ నౌకాదళం

### పశ్చిమాసియాను అదుపుచేయాలనే అని శ్రీ ఐసెన్‌హోవర్ ప్రకటన

వాషింగ్టన్, ఏప్రిల్ 25: మధ్యధరాసముద్రానికి అదనంగా నాలుగు అమెరికన్ యుద్ధనౌకల్ని పంపడంలో ఉద్దేశం, పశ్చిమాసియాలో పరిస్థితిని అదుపులోకి తేవాలనే అని అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ పత్రికాసమావేశంలో ప్రకటించారు.

ఫార్మోజా మొదలైన ప్రాంతాలలో పరిస్థితులను అదుపులో పెట్టడానికి అమెరికన్ నౌకాబలాన్ని పంపినట్లే ఇక్కడ పంపారు కాని ఇంతకు మించిన విశేషం ఏమీ లేదని శ్రీ ఐసెన్‌హోవర్ అన్నారు.

పశ్చిమాసియా పరిస్థితి చర్చించడానికి రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, ఇజ్రాయల్, అరబ్ దేశాల అధిపతుల సమావేశం జరపడం నిష్ప్రయోజనం అని శ్రీ ఐసెన్‌హోవర్ అన్నారు.

మధ్యధరా సముద్ర ప్రాంతంలో అమెరికన్ నౌకాబలం ఎప్పుడూ ఉన్నదేనని శ్రీ ఐసెన్‌హోవర్ పత్రికాసమావేశంలో ప్రశ్నలకు జవాబిస్తూ చెప్పారు.

ఈ నౌకాబలానికి అదనంగా నాలుగు యుద్ధనౌకల్ని పంపడంలో, ఆ ప్రాంతంలో అమెరికా ప్రాబల్యం, అధికారాలను విస్తరింపచేసుకోవాలనే ఉద్దేశం లేదన్నారు. ఫార్మోజా ప్రాంతంలోమాదిరే ఈ ప్రాంతంలో పరిస్థితులు అదుపులోకి తీసుకురావడమే అమెరికా అభిమతం అన్నారు.

పశ్చిమాసియాలో యుద్ధం సంభవించకుండా నివారించడానికి రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, ఇజ్రాయల్, అరబ్ రాజ్యాధిపతులు సమావేశం ... శ్రీ ఐసెన్‌హోవర్ చెప్పారు.

హోవర్ చెప్పారు. అయితే పై సూచనలమాదిరిగా రాజ్యాధిపతుల సమావేశం ప్రయోజనం ఉండదన్నారు. ప్రయోజనం ఉంటుందని ఎవరైనా నిరూపించగలిగితే ఒప్పుకుంటా రన్నారు.

### నిరాయుధీకరణ

బ్రిటన్‌లో సోవియట్ నాయకులు నిరాయుధీకరణకు చేసిన కొత్త ప్రతిపాదనలను శ్రీ స్టాసెన్ తమకు అందచేశారని చెప్పారు. ఇది ఇంకా పూర్తిగా పరిశీలించలేదు కాని, అందులో కొత్త ఏమీ కనపడలేదన్నారు. అసలు కమ్యూనిస్టుల మనస్తత్వం ఏమీ మారినట్లు కనపడ్డం లేదన్నారు.

### రష్యన్ల అమెరికా సందర్శనం అనవసరం

ప్రస్తుత పరిస్థితుల్ని బట్టిచూస్తే, సోవియట్ నాయకులు అమెరికా కూడా సందర్శించినందువల్ల ప్రయోజనం ...

### స్వయంచోదిత అస్త్రాలు

(4వ పేజీ 7వ కాలం చూడుడు)

## శ్రీలంకకు అమెరికా ఆర్థిక సహాయం

### షరతులు లేవని ప్రధాని ప్రకటన

కొలంబో, ఏప్రిల్ 25: అమెరికా ఇవ్వ బోయే ఆర్థిక సహాయానికి ఎలాటి షరతులూ లేవని చెప్పా, భారతదేశం తీసుకుంటున్న షరతుల ప్రకారమే శ్రీ లంక కూడా స్వీకరిస్తుందని ప్రధాని శ్రీ బండార నాయకే పత్రికా సమావేశంలో తెలియచేశారు. ఈ సహాయం కొలంబో ప్రణాళిక ననుసరించి లభిస్తుం దన్నారు.

ఇతర దేశాలనుంచి, రష్యా, చీనా లతో సహా సాంకేతిక నిపుణుల సహాయం శ్రీలంక తెచ్చుకుంటుందని చెప్పారు.

ఆస్ట్రియాలో యుద్ధ విరమణకు ఫ్రాన్సు ఒప్పుకోడం మంచిదని శ్రీ లంక అభిప్రాయమైనట్లు చెప్పారు. తన అభిప్రాయాన్ని శ్రీ లంకలోని ఫ్రెంచి రాయబారిద్వారా ఫ్రెంచి ప్రభుత్వానికి తెలియపరుస్తారు.

శ్రీ లంకలోని భారతీయుల సమస్యపై లండనులో కామన్వెల్తు ప్రధానుల సమావేశ సమయంలో శ్రీ నెహ్రూతో లాంఛనంగా మాత్రం మాట్లాడగల రనీ, ఆ తరవాతి సమావేశాల చర్చలు జరప గలరనీ చెప్పారు. ఈలోగా ఎలాటి మార్పులూ ఉండవన్నారు.

లార్డ్-మౌంట్ బాటెన్‌తో ప్రసంగించినందువల్ల బ్రిటన్‌లో శ్రీ లంక మారిన ప్రభుత్వంపై భారీపట్ల అపోహలూ, అనుమానాలూ తొలగించే అవకాశం లభించిందన్నారు.

సోవియట్ రష్యాలో ఇటీవల మార్పుల్ని గురించి ప్రశ్నించగా, “ఇతర దేశాల అంతరంగిక వ్యవహారాల గురించి” వ్యాఖ్యానించడానికి నిరాకరించారు.

అమెరికాలో మొదట తమ ప్రభుత్వంపట్ల కనపడిన విభ్రమం క్రమేణా తొలగిపోతోందనీ, ఇప్పుడు అమెరికన్లు సక్రమంగా అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నారనీ చెప్పారు.

### పాకిస్తాన్‌తో సంబంధాలు

విదేశాంగ విధానంలో సుమారు శ్రీ నెహ్రూ పద్ధతినే అనుసరించినంత మాత్రంచేత పాకిస్తాన్‌తో వైరం తెచ్చుకోవడం తమ అభిమతం కాదన్నారు. పాకిస్తాన్‌తో కూడా మైత్రితోనే ఉండగలరన్నారు. కాశ్మీరు సమస్యపై ఏ అభిప్రాయం తెలపడానికి శ్రీ బండార నాయకే నిరాకరించారు.

బ్రిటన్‌తో నౌకాస్థావరాల విషయంపై రహస్యపు ఒడంబడిక ఏదీ లేదనీ చెప్పారు. అమెరికా వాణి, ఆసియా సంస్థల విషయం త్వరలోనే పరిశీలించగలరని చెప్పారు.

సింహళ భాషే రాజభాషగా నిర్ణయిస్తూ ఒక శాసనం ప్రవేశపెట్టగలరని తెలియచేశారు.

## భద్రాచలం యాత్రికుల మృతి

### ఆరోగ్యశాఖాధికారి వివరణ

మదరాసు, ఏప్రిల్ 24: శ్రీరామ నవమి ఉత్సవాలకు భద్రాచలం వెళ్ళి ఇళ్ళకు తిరిగిపోతున్న యాత్రికులలో యిద్దరు కొట్టెగూడెం, సుమ్మారులవద్ద కలరావల్ల మరణించారని ఆంధ్రపత్రికలో 23-వ తేదీని ప్రకటితమైన వార్త ఆధారరహితమని అవి కలరాకేసులు కావని ఆంధ్ర ఆరోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయం వారు తెలియచేస్తున్నారు.



బాపట్లతాలూకా పంచాయతీల అధ్యక్షులు, పంచాయతీ ఉద్యోగులు—ఒంగోలు ప్రాంతీ పంచాయతీ అధికారి శ్రీ పి. సత్యనారాయణ బదిలీ అయినప్పుడు వీడ్కోలు ఇచ్చారు.

## ద్వితీయ ప్రణాళిక

### మూడు రోజుల చర్చ ఏర్పాటు

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, ఏప్రిల్ 24: కేంద్ర ప్రభుత్వం వారు రేపటినుంచి రెండో పంచవర్ష ప్రణాళికను గురించి చర్చలు ప్రారంభిస్తున్నారు. ఇవిమూడురోజుల పాటు 25, 28, 29 తేదీలలో జరుగుతాయి. ప్రధానమంత్రి 26, 27 తేదీలలో రాజధానిలో వుండరు. అందువల్ల ఇట్లా ఏర్పాట్లు చేసుకున్నారు.

ఇప్పుడు ఈ పథకంలో ఏమన్నా మార్పు జరిగిందా అని విచారించగా అట్టిదేమీ జరగలేదని తెలియవస్తున్నది. ఇప్పుడుగూడా ఈ పథకంలో 4800 కోట్లే ప్రభుత్వ రంగంలో ఖర్చుగా కన్పిస్తున్నది. ఆర్థికమంత్రి ఈ మధ్య పార్లమెంటులో అన్నట్లు ఇందులో ఎట్టి హెచ్చింపుగాని లేదు. ఆర్థిక మంత్రి ఈ ప్రణాళికలో ప్రభుత్వ రంగంలో ఒక 200 కోట్లు పెరగవచ్చు నన్నారు.

ఈ పథకంలో ఇంకా కేటాయించ వలసిన పద్దులు కొన్ని వున్నాయి. అవి ఇవి:—

| | | |
|---|---|---|
| 1. నూనె గనుల పరిశోధన | 100 | కోట్లు |
| 2. భారీ పరిశ్రమలు | 35 | ,, |
| 3. బొగ్గు — — | 60 | ,, |
| 4. పంటుల్లి శాలలకు సబ్సిడీలు | 65 | ,, |
| 5. అంబర్ చర్కాకుసబ్సిడీ | 200 | ,, |
| 6. రక్షణ ఖర్చులు | 400 | ,, |

పార్లమెంటులో మాట్లాడుతూ ప్రణాళికను గురించి ఆర్థికమంత్రి, వాణిజ్య పరిశ్రమల మంత్రి వేరు వేరు భావాలను వెల్లడించి ఉన్నట్లే ప్లానింగు కమిషనులో గూడా వేర్వేరు భావాలను వెల్లడించగలరని గూడా తెలుస్తున్నది. అందువల్ల ఈ ప్రణాళికకు కొన్ని విప్రతిపత్తి పత్రాలు గూడా వుండవచ్చు ననుకుంటున్నారు.

పార్లమెంటులో ఆర్థికమంత్రి ప్రణాళికను అమలుజరపాలంటే వున్న కష్టాలను పేర్కొన్నారు. వాణిజ్య పరిశ్రమల మంత్రి వున్న భాండారానికి మించి ప్రణాళికలు వెయ్యడం తగ దన్నారు.

## అందరికీ కబురుపంపి ఆత్మహత్య

కరైకల్, ఏప్రిల్ 25: బంధువులకు, మిత్రులకు, పోలీసులకు, అందరికీ 22 ఉత్తరాలు వ్రాసి రైజా అరుల్ అనే 22 ఏళ్ళ యువకుడు ఆత్మహత్య చేసుకొన్నాడు. కుటుంబ చిక్కులవల్ల, ఆత్మహత్యకు సిద్ధపడినట్లు ఆ ఉత్తరాల్లో వ్రాశాడు.



దిగువమెట్టలో జాతీయాభివృద్ధి కార్యక్రమం క్రింద ఏప్రిల్ 18 వ శ్రీయుతులు డి. సంజీవయ్య, పిడతల రంగా రెడ్డి సముఖంలో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం జరిగింది.



గుడివాడలో ఏప్రిల్ 7 వ జరిగిన కృష్ణాజిల్లా నిమ్నజాతి కార్యకర్తల సమావేశంలో శ్రీ డి. సంజీవయ్య, శ్రీ ముళ్ళపూడి రాజేశ్వరరావు, శ్రీ టి. కె. మోహన్, శ్రీ టి. వెంకటదాసు, శ్రీ ఎమ్. దాశరథి.

## స్వలాభం మానుకొని ఐక్యతను బలపర్చాలి

### రాష్ట్రపతి హితోక్తులు

కాన్పూర్, ఏప్రిల్ 24: జాతీయ ఐక్యతను బలపరుచుకోటానికి త్రికరణ శుద్ధిగా కృషి చేయాలని రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఒక విజ్ఞప్తి చేశారు.

‘ప్రధానమైన జాతీయైక్యత, తెలిసో, తెలియకో, ఏవిధంగా జరిగినప్పటికీ దెబ్బతినటం సంభవిస్తే, కష్టార్జితమైన స్వాతంత్ర్యానికి ముప్పుతప్పదు. అని ఫూల్‌బాగ్‌లో జరిగిన బ్రహ్మాండమైన ఒక బహిరంగసభలో ప్రసంగిస్తూ రాష్ట్రపతి హెచ్చరించారు.

‘భారతీయులు చిత్తశుద్ధితో దేశ ఐక్యతా స్వాతంత్ర్యాల పరిరక్షణకు కంకణం కట్టుకోవాలని డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ ఉద్బోధించారు.

డాక్టర్ ప్రసాద్ తమ ప్రసంగంలో యింకా యిలా చెప్పారు:

‘మన బలహీనతలు పైచేయిగా ఉండటానికి సహించరాదు. స్వలాభాన్ని దూరంగా ఉంచి, అవసరమైతే జాతి ప్రయోజనం కోసం త్యాగం చెయ్యాలి.

దేశంలో యిటీవల కొన్ని ప్రధాన విషయాలమీద అవాంఛనీయ ప్రదర్శనలు జరిగాయి. వీటితో జాతీయైక్యతకు ప్రమాదం సంభవించిందనిపిస్తోంది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ, భాష తదితర అంశాలమీద కొందరు మిక్కిలి సంకుచిత స్వభావాన్ని ప్రదర్శించారు.

ఉత్తర దక్షిణాలన్న భేదాలు, ప్రాంతీయ తత్త్వం, కులతత్త్వం లాంటి సంకుచితతత్త్వాలను తావిచ్చి పరస్పరం కీచులాడుకోటం మొదలు పెట్టారు. ఈ విపరీతమైన ప్రదర్శనలు చాలా సంతాపం కలిగించాయి.

దేశంలో ఐక్యతాభావం బొత్తిగా లేకపోలేదు. ఈ సువిశాల దేశంలో సమైక్యతాశక్తి ప్రాజ్యంఅయి ఉన్నట్లయితే మనకు స్వాతంత్ర్య సంపాదన చాలా కష్టసాధ్యమై ఉండేది.

కొన్ని సమయాల్లో యీ ఐక్యతా విజృంభణ అంతర్థానమై సంకుచిత భావాలు అలముకున్నట్లు కనిపిస్తుంటుంది. బలీయమైన జాతిగా పరిణామం చెందగోరే దేశానికి యిది దుర్లక్షణం. కాబట్టి యీ సమయంలో సంకుచిత స్వభావాన్ని ఛిన్నాభిన్నం చేసి జాతీయ ఐక్యతను దృఢతరం చేయాలి.

మహాత్మాగాంధీ అహింసను ప్రసంగించారు. కొందరు భావిస్తున్నట్లు అది పిరికిపందల పద్ధతి కాదు. అది సాహసవంతుల సముజ్జ్వల సాధనం. గాంధీ మహాత్ముని నాయకత్వం కిందనే భారతీయులు బ్రిటిషువారితో పోరాడారు. ఇదంత సులభసాధ్యమైన పని కాదు. ఆ విధంగా కష్టపడి సంపాదించిన స్వాతంత్ర్యాన్ని యిప్పుడు భద్రపరుచుకోవాలి.

ఆ ఐక్యతను తీవ్రంగా ఆచరించి,అంతా ఒకటే అనే భావాన్ని మనం పెరవల్లు తొక్కించాలి. సుదృఢ, అచంచల ఐక్యత ప్రాతిపదికగా జాతీయ పునర్నిర్మాణ కృషి జరగాలి.

బ్రిటిష్‌వారిని తరిమివేయటంకంటె కూడా జాతీయ పునర్నిర్మాణ కార్యకలాపం ప్రధానమైనది. స్వాతంత్ర్య సముపార్జనకంటె, ఈ కార్యక్రమంలో అనేక కష్టాలను ఎదుర్కోవాల్సి ఉంటుంది.

నాశనం కంటె నిర్మాణం చాలా కష్టం. మనకుఅమోఘమైన ప్రణాళికలు ఉన్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సిద్ధంగా ఉన్నది. ఈ ప్రణాళికల లక్ష్యాలు అనుకున్న అవధికి సిద్ధించేటట్లు మనంచూడాలి. ఈ విషయంలో నిర్లక్ష్యం ఎంత మాత్రం పనికిరాదు.

జాతీయ ప్రయోజనాలను వేయి కళ్లతో కాపాడాలి. పురాతన చరిత్రాత్మక లొసుగులు పునరావృత్తం కాకుండా చూడాలి.

ఒక నూలుపోచను, పసిపాప గూడా తెంపగలదు. ఈ దారాలను ఒక దృఢమైన త్రాడుగా పేనినప్పుడు ఏనుగు గూడా దాన్ని తెంపలేదు. భారత దేశం వైవిధ్యతాభావనిలయమైన భూమి.

మనదేశంలో వివిధభావాలు, ఆచారాలు, మతాలు, సాంఘిక వ్యవస్థలు ఉన్నాయి. విభిన్నత్వం పాపహేతువు కాదు. భిన్నత్వంలో ఏకత్వం సాధించాలి. ఈ ప్రత్యేకతా భావాన్ని ప్రోత్సహించినప్పుడు అది శాపంగా పరిణమిస్తుంది.

దేశంలోని వివిధప్రాంతాలు పురోభివృద్ధి చెందవచ్చును.పోటీకూడా చేయవచ్చును. అయితే యీ పోటీ పద్ధతులు దారితీసేదిగా ఉండాలి. ఇందులో జాతీయైక్యత ఆహుతి కాకూడదు.

## శంకర్రావుదేవ్‌కు గండం తప్పింది

సోలాపూర్, ఏప్రిల్ 25: మహారాష్ట్ర నాయకుడు శ్రీ శంకరరావుదేవ్, పంఢరిపూర్ నుంచి, సోలాపూర్‌కు ప్రయాణం చేస్తుండగా ఆయనకారు, వంతెనమీదకు రాగానే బ్రేకుపడనివ్వని స్థితిలో డ్రైవరు మోటారుపట్ల ఘోర ప్రమాదం తప్పించాడు. డ్రైవరు తిరుగులేని వేగం తగ్గించి, కారునుంబలో పక్కకుపోకుండా కాపాడాడు.

## ప్రణాళికా స్థాయీ సంఘం త్వరలో నియామకం

ఢిల్లీ, ఏప్రిల్ 25: ప్రణాళిక ఖర్చులు కార్యక్రమాలు ఎలా సాగుతున్నవో చూడడానికి,దుర్వ్యయాన్ని అరికట్టడానికి ఒక స్థాయీ సంఘాన్ని నియమించాలని సంకల్పించినట్లు ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రసంగంలో తెలియజేసిన సంగతి పాఠకులకు విదితమే.

ఈ సంఘంలో కేంద్ర ఆర్థిక, నీటిపారుదల విద్యుచ్ఛక్తి, వాణిజ్య పరిశ్రమ, నిర్మాణశాఖల మంత్రులు; ఇద్దరురాష్ట్రముఖ్యమంత్రులూ ఉంటారని తెలుస్తున్నది.

పన్నుల విచారణ సంఘంలో కార్యదర్శిగా పనిచేసిన సర్దార్ ఇందర్ జిత్ సింగ్ కూడా ఇందులో సభ్యులుగా ఉంటారు.

## హిందీ అధ్యాపక శిక్షణా శిబిరం

హైదరాబాదు, ఏప్రిల్ 25: హైదరాబాదు హిందీ ప్రచార సంఘం పక్షాన శివరాంపల్లి గ్రామసేవా కేంద్రములో మే 5 వ తేదీ మొదలు 15 వరకు హిందీ అధ్యాపక శిక్షణ శిబిరము జరుపబడునని, దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి విశారద లేక ఈ పరీక్షకు సమానమైన పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు ఈ శిబిరములో చేర్చు కొనబడుదురని, విద్యార్థులకు ఈ శిబిర కాలంలో ఉచిత భోజనవసతి ఏర్పాటు చేయబడునని శిబిరములో చేరగోరువారు తమ దరఖాస్తులను “కార్యదర్శి, హైదరాబాదు హిందీ ప్రచార సంఘం,327 రెసిడెన్సీరోడ్డు, హైదరాబాదు” అనే చిరునామాకు ది 28-4-56 లోగా పంపవలెనని కార్యదర్శి శ్రీ వేమూరు ఆంజనేయశర్మ తెలుపుతున్నారు.

